# పవిరతరత




సంపాదకత్వం :

## టి. శ్రీరంగస్వామి

Regd. 2337




Estd. 1977

# ప్రమోయాత

[కవితా సంకలనం]

సంపాదకత్వం

టి. శ్రీరంగస్వామి

శ్రీలేఖ సాహితి
481
5-11-~~114/4~~ విద్యారణ్యపురి
వరంగల్లు - 506009

"ప్రమోదూత" ఉగాది (27-3-1990)

ప్రచురణ : శ్రీలేఖ సాహితి ద్వాదశ పుస్తకం

హక్కులు: సంస్థవి

వెల : ఆరు రూపాయలు

ముద్రణ : నటరాజ్ ప్రింటర్స్, వరంగల్లు

నిత్య సృజనతో
నిత్య చైతన్యంతో పరిభ్రమిస్తూ
సాహితీ సేవలో
నిరంతరం శ్రమిస్తూ-
తెలుగు సాహిత్యంను
'తెలిదమ్మికంటి'ని చేసిన
తెలుగన్న, మా 'నారన్న'
జ్ఞానపీఠ అవార్డు గ్రహీత-
మా ఆత్మీయులు

**ఆచార్య సి. నారాయణరెడ్డి గారికి**

ఈ చిరుపొత్తం
కానుకగా.....
చంద్రునికో నూలుపోగులా...

**శ్రీలేఖ సాహితి**
వరంగల్లు

# మీతో ఒక్క క్షణం

సాహితీ మిత్రుల సమైక్యభావ స్ఫూర్తికి సార్థకమైన చిహ్నంగాను, "స్నేహం నీడనిచ్చే చెట్టు లాంటిదనే".... భావనలో... పయనిస్తున్న మా సంస్థ ఆశయంలో వెన్నుతట్టి. ప్రమోదముగా మూడవ సంకలనం ప్రమోదాత అందించడంనకు చేయూతను ఇచ్చిన ప్రతి ఒక్కరికీ కృతజ్ఞతలు కాలచక్రం నిరంతరం భ్రమిస్తూనే ఉంటుంది. ఆ భ్రమణంతో క్రొత్త కవులు ఎందరో ఉద్భవిస్తూనే ఉంటారు ఆ ఉదయించిన కిరణాల్లోని తేజంను ప్రతిబింబింప చేయాలనే ప్రయత్నంలోనే వెలువడినది ఈ కవితా సంకలనం.

మా 'శ్రీలేఖ సాహితి' కేవలం సాహిత్య సేవకు అంకితము అయినది. మా ఆహ్వానాన్ని మన్నించి, మా మీదవాత్సల్యంతో ఎందరో పండితులు విజ్ఞులు మా సభల్లో పాల్గొని వాటిని జయప్రదం చేసినందులకు మా కృతజ్ఞతలు. ముఖే ముఖే సరస్వతి కదా! తోచిన మేరకు తీరిక సమయాన్ని సాహిత్య పరంగా సద్వినియోగపరచటం మంచిదనే మా భావం. ఏమిటి వారిలోని రచించగలిగే నైపుణ్యాన్ని, ఆలోచనలను రేకెత్తింపచేయాలనే ప్రయత్నంకు పుస్తక ప్రచురణ, సదస్సులు నిర్వహించి యువకులకు చేయూత నివ్వడం మా ధ్యేయం.

మా ఈ కవితా సంకలనం తీసుకొనడంనకు తమ ఆమోదాన్ని తెలిపి ఈ పుస్తకమునకు మరింత వాసిని తెచ్చిన, తెలుగు తేజమును శిఖరారోహణగావింపచేసిన, జ్ఞానపీఠాధిపతి ఆచార్య సి. నారాయణ రెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

మా పయనంలో చేయూతను ఇచ్చి ... ముందు ముందు మరిన్ని కార్యక్రమాల రూపకల్పనకు అవకాశం సాహితీ మిత్రులు.... ఔదార్యులు.... తమ సహృదయతతో మరింత ఉదారతతో ముందుకు వస్తారని ఆశిస్తూ—

యస్. శ్రీనివాసస్వామి
అధ్యక్షులు

డి. వి. శేషాచార్యులు
సంయుక్త కార్యదర్శి

# ఈ పూల తోటలో...

— భువనగిరి నాగరాజు

గాలి ఊయలలో —
మొగ్గలు కంటున్న పంచరంగుల కలల్ని
అలలై చరిస్తున్న పూల పరిమళాల నవ్వుల్ని
పిచ్చుకత్తులై గుచ్చుకుంటూ
జలగల్లా పీల్చేస్తున్నాయి — ముండ్ల పొదలు!
సుడిగాలుల పాలై ఆ సుడిగుండాలకు బలై
నిట్టూర్పుల అగ్నిశిఖల దాడిలో
ఎడారులై పోతున్నాయి — హృదయాలు!
నిరాశల చీకట్ల శృంఖలాల్లో
బందీగా కుములుతున్న మనిషిని —
గంగా ప్రవాహాలమై స్పర్శించి
వెలుగుల వెల్లువలమై కౌగిలించి
చైతన్య కేతనంలా ఎగరేయాలి!
నివుర్ల ముసుగులు కప్పుకున్న నిప్పురవ్వల్లారా!
అక్షరాల్ని ఆయుధాలుగా మార్చి
పదాల్లో ప్రాణవాయువుల్ని కూర్చి
మనిషి మనిషికీ అందించాలి!
కదలి రండి — మనమంతా ఈ పూల తోటలో
వేయి కలాలతో పహరా కాయాలి!
మనిషిని మండే సూర్యునిలా వెలిగించాలి!!

ఇ. నెం. 6-3-182/ [illegible] వీధి, తిరుపతి 517507

# అడుగడుగున గుడి

- వై.వి. మహీందర్ కుమార్

సాయంత్రాన్ని సముద్రంలో రంగరించి
వెన్నెల పర్వతం మీద మంచి గంధాన్ని మోసుకొస్తూ
అందమైన పిల్లగాలి అమాయకంగా అడిగింది,
ఎందుకు నేస్తం? నీకింత సంతోషం అని,
వెండి కిరణం పెదవి అంచున చెదిరినట్లు,
కొండ చివరన సంధ్యనీడ పాకినట్లు,
ఒక అమృత హృదయంతో స్నేహం దొరికినప్పుడు....
అక్షరాల బరువుతో అలసిన పుస్తకానికి అరక్షణం విశ్రాంతినిచ్చి
కళ్లు ఒళ్లు విరుచుకొనే సమయాన,
ఎండుటాకుల వెనుక చిరుగాలి కదలికలా ఒక జ్ఞాపకం........
పడగ్గదిలో వివేకానందుడి పటం ముందు అగరొత్తి పరిమళం
నిలువెల్లా పాకి వ్యాపిస్తుంటే సంతోషం కాక మరేమిటి నేస్తం,
అన్నాను........
వెన్నెల విస్తుబోయింది
కన్నెలా సిగ్గుపడి నన్నిలా వదిలి వెళ్ళిపోయింది
చీకటి కూడా అలసి నిద్రపోయాక వాస్తున్న చిరు ఉత్తరం
ఓదారుస్తున్న ఒంటరి తనం........
కిటికీ అవతల మల్లె మొక్క
కిటికీ ఇవతల నా మనసు మీద నీ జ్ఞాపకం కస్తూరి చుక్క.

---

ఇ. నెం. 5-11-98/2, విద్యారణ్యపురి, వరంగల్-506009

# అసలైన స్వాతంత్ర్యం

–శ్రీమతి ఎ. భారతి

నేడే స్వాతంత్ర్య దినమని
దేశ మాత దాస్య శృంఖలాల విముక్తి దినమని
భారతీయులకు పర్వ దినమని
సంబరాలు చేసుకుంటాము
జండాను ఎగురవేసి
సంతోష సాగరంలో తేలిపోతుంటాం.
కాని........ ఆ మరుక్షణమే
ఏదో తెలియని అసంతృప్తి
పొందిన ఆనందం అంతా
హుష్ కాకియై ఎగిరిపోతుంది.
ఎక్కడ చూసినా అశాంతి అలజడులే
మహత్తా మానవత్వం నశించి
మానవుడే దానవుడిగా మారుతూ
తోటి వాడిని హింసిస్తూ
అందులోనే ఆనందం వెతుక్కునే
మానవుల మధ్య ఎక్కడుంది స్వాతంత్ర్యం–
స్వాతంత్ర్య సముపార్జనకు అర్థం ఇదేనా,
కాదు.... రేపటి ఉషోదయాన
తూరుపు ఒడ్డున సరికొత్త సూరుడుదయించి
పెనుచీకట్లను పారద్రోలి,
చీకటి బ్రతుకులలో చిరు దివ్వెల వెలిగించి
అందరికీ ఆనందం పంచిన నాడే
అందరు ఒక్కటే అన్నదమ్ముల వలె
మెలిగిన నాడే అసలైన స్వాతంత్ర్య పర్వదినం.

ఇ. నెం. 2/438/9-4-1, యస్.బి.హెచ్. కాలనీ, సుబేదారి, హన్మకొండ

# సూర్యుడూ...నిజమూ

— 'రఘువర్మ

సూర్యుడు
నిప్పులాంటి నిజం!
అవినీతి చీకటి
అతనిని దాచేయాలనుకుంటూ
పశ్చిమాద్రి చాటున దాచిన
తన చేతి పిడికిలిలో బంధిస్తుంది!
అయితే అతని వేడిమిని భరించలేక
ఒంటిపై పడవేసుకుంటుంది!
అయినా సరే — పట్టువదలక అతనిని
ఉదయాద్రి చాటున దాచిన
తన ఇంకో చేతి పిడికిలిలో బంధిస్తుంది!
కానీ — ఆ చేయీ
అలాంటి రుచే చవి చూసి ఆ సూర్యుణ్ణి
పశ్చిమాద్రి చేయి వైపే విసురుతుంది.
పాపం!
అవినీతి చీకటి నిజంగా పిచ్చిది!
ప్రతిసారి....ఇలా
సూర్యుణ్ణి దాచేయాలని
ప్రయత్నిస్తూనే ఉంటుంది!
ఎప్పుడూ చేతుల్ని కాల్చుకుంటూనే ఉంటుంది!
ఒళ్ళంతా చుక్కల గాయాల్ని
చేసుకుంటూనే ఉంటుంది!

రిసెర్చ్ స్కాలర్, తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబా

# శాంతిదూత

- యం.వి. ప్రసన్న

ప్రమోదూత
విశ్వశాంతి దూత
ప్రగతి ప్రదాత
స్వాగతం - సుస్వాగతం
కుసుమ కోమల
తుషార మాలిక
పడుచు గుండెల
మువ్వల రాగ మాలిక
జాతి నేతల
తల రాతల తీర్చిదిద్దు
తల్లిమాత - విధాత
చరా చర జీవరాసుల
పాప పుణ్యాల
పరుగు పందాల
పరదాలు తొలగించు
పులకించు నా మేను
నిండు పున్నమిలాగ
స్పందించు నా మది
రసగంగ ఉప్పొంగ
ప్రమోదూత
స్వాగతం - సుస్వాగతం

ఇం. నెం. 5-10-39/సి కిషన్‌పుర, హన్మకొండ-506001

# ఓ ప్రజా స్వామ్యమా !

– పల్లెసీను

ఓ ప్రజాస్వామ్యమా! నీ కింత స్వార్థమా?
ఎంత చెప్పినా నా పీక నొప్పేకాని
నీ చెవి బూజు దులపడం లేదు.
నా కల(త)కల ధ్వని కూడ నీ తలకెక్కడం లేదు.
పరస్పరం నిరంతరం నీతులు వినిపిస్తూనే
'ఓటు' కూర్చిన భారతాత్మ గుండెల్లోకి
'అనువంశిక' మనే మేకు మెల్లిగా దిగుతోంది
బంధు ప్రీతి నిగళాలు నిలువునా బంధిస్తున్నాయి.
'సార్వత్రిక సౌభాగ్యం' నినాదం పరకే గాని
చిల్లర కొట్టు వెనుక చీకటి బజారుందని
అల్లరి పెట్టినా నీకది అశరీరవాణిలా తోస్తోంది
చెమటోడ్చిన ద్రవ్యం కూడ చిల్ల పెంకులా తోస్తుంది.
నీ కళ్ళకు చెల్లని నాణెంలో మెరుస్తోంది.
ఓ ప్రజాస్వామ్యమా! ఇది నీకు పాక్షికమా?
స్వార్థ పీడిత రాజకీయం సాధారణంగా మూల్గుతోంది
మైల పడని పాపభీతి – పారాణిలా అంటుతోంది
విసుగులో విచిపోయిందేగాని విజయకేతనం మాదేనని
విధవా వ్యామోహాన్ని వెర్రిగా కాంక్షిస్తోంది
వ్యక్తి శక్తి వ్యంగ్యంగా చిత్రించి-వక్త గొంతు వ్యక్తీకరించిన
చిదంబర రహస్యాలు కూడ 'నిధి' బొక్కలో దూరిపోతున్నాయి
ప్రమోదాత పాలకం – ప్రజా ప్రగతి వాలకం
ప్రయోజిత క్రమమేనా? పాటు తెలియని ఫలమేనా?
ఓ ప్రజాస్వామ్యమా? ఇది నీకు తగు న్యాయమా?

నేరేడుపల్లి, మల్లంపల్లి; వరంగల్లు-506349

# స్వాగతం ప్రమోద

—'రాధిక'

స్వాగతం, సుస్వాగతం ప్రమోద
అవగతం చేసుకోతల్లి, మాకథ
మితమైన ఉద్యోగాలతో, అమితమైన కష్టాలతో
కుంటుపడుతుంది యువతలో మేధ
పన్నులు కొందరికే, అవి సంపన్నుల జోలికిపోవు కదా!
కొన్ని చావులకు కారణం క్షుధ
నెలలో జీతంకాదు, సంతోషమే అదా
నీళ్ళురాని కుళాయిలతో తీరదు సేద
కన్నీళ్ళు కార్చినా, కరగదు కామాంధులఎధ
సారంలేని, సంసారంలో హాలాహలపువ్యధ
సోమలరొద, దొంగలబెడద
పిడిబిగించిన, రౌడీలసొద
అమ్మమ్మ....చెప్పలేము మాబాధ
రాహూ, కేతువులలో, సంఘం అవుతున్నది అనాధ
అవినీతి ఎదిగింది ఎవరెస్టు ఎత్తు
అందుకే నీవు మోహిని అవతారమెత్తు
అన్నదే మా వేదికలేని నివేదిక సదా
పదపద బిగించు పయ్యెద
పంచు మానవత్వపు, సమానత్వపు సుధ
అప్పుడే, నివసించు, శాంతి సుఖాలు, ఈ వసుధ

డి-16, డాక్టర్స్ క్వార్టర్స్, మహారాణిపేట, విశాఖ-530003

# పట్టుకోండి వాణ్ణి

— చిట్టిప్రోలు వెంకటరత్నం

పట్టుకోండి వాణ్ణి
పారిపోతున్నాడు
ఈ ప్రపంచంలో
సత్యం, ధర్మం, నీతి న్యాయం-
ఇవి ఆరు నిలువుల లోతున సమాధి చేయబడుతున్నాయట;
ఇది యెంతో ఘోరంవట,
పక్కవాణ్ణి – బలహీనుడు కదా అని
పీక నులిచేసి సొమ్ము దోచేసుకుంటే
అది నేరంవంటున్నాడు
ఇంకా ఏవేవో అంటున్నాడు-
అని పారిపోతున్నాడు
పట్టుకోండి పారిపోనీయకుండా
కట్టివేసి నిలువుగా పాతెయ్యండి అరపై నిలువుల లోతున.

# ! ఓ ! చరిత !

– అట్లూరి వెంకట విజయ్ కుమార్

చరిత ! ఓ ! చరిత !
చరిత్ర నే సృష్టించు
చరిత ! ఓ ! చరిత !
విప్లవాల విల్లుపట్టి
ప్రజాశరములను విడచి
నిరంకుశము నీరశింప
చరిత్రనే తిరిగివ్రాయు
చరిత ! ఓ ! చరిత !
నీకు సాటిగలరెవ్వరు
ఎన్నో ప్రక్రియలు తెచ్చి,
కాలములో కాలరాసి,
నూత్న విత్తనములు నాటి,
మొక్కలుగా చేసివాటి
పెంచి పెద్ద చేసి చూసి,
కాలముతో పరుగు తీయింతువు
సాగుతున్న సాగింతువు
భవిష్యత్ చిత్రపటంలోనికి
శిలాక్షరాలతో
నీ చరితను వ్రాయింతువు
చరితా ! ఓ ! చరిత !

3/4 బి.టెక్ రీజినల్ ఇంజనీరింగ్ కళాశాల, వరంగల్–506004

# కారణం

—పల్లేరు వీరస్వామి

ధరవరలకేం తక్కువ
ధరల వరాల్ని ప్రసాదించారు
నాకలోకమని మురిపించి
నరకలోకాల్ని మరిపిస్తున్నారు
ఎందరో నరులు
కొందరు నరవాహనులు
నాలుగు దశాబ్దాలుపైగా వంగి మోసిన నడుం
ఇంకా మోయలేనంటూంది యీ దరాదరం
అందుకేరా అబ్బీ!
పరకాలను నరకాలంటున్నది

ఇ. నెం. 3-68/2జి/1 పరకాల, వరంగల్లు-506164

# మట్టి

— బిరుదరాజు మాధవరాజు

మట్టిపైన పుట్టిగిట్టె
మనషీ మంచిలో మసలవోయ్
మనసువున్నా మనిషికన్నా
మనసులేని మట్టి నయమోయ్
మనసులేని మట్టి అయినా
మానవత్వం సమత చాటుర
గాంధీ నెహ్రూ ఘనాఘనులు
ఝాన్సి, తాంతియ, ఛత్రపతుల
చైత్యు, చైత్యపు, చైత్ర్యభూమిది
మనల తనలో దాచునట్టి
మనికు మనువుల నిచ్చునట్టి
మహామహులను మనకునిచ్చే
మట్టిపైనా! పుట్టిగిట్టే
మనిషి మంచితో మసలవోయ్!

# రక్తాక్షరాలు

-దేవులపల్లి వెంకటేశ్వరరావు

పెద్దవాడు
పెంచుతూన్న చట్టం
పేదవాన్ని నిలదీసి
నిలువునా నరుకుతూంటే-
రక్తం ఏరులై ప్రవహిస్తూ
ఎరుపెక్కిన భూమాత
కంటతడి పెడుతుంటే
నక్షత్రాలన్నీ
చేతులు కలిపి నవ్వుకుంటూంటే
చూస్తూ యింకెంతకాలం
ఊరుకుంటావు నేస్తం-
నిజాన్ని కొరడాలతో చరచి
న్యాయాన్ని వురికంబాలెక్కిస్తున్న
హంతకులపై కుద్రేకంతో
వుపక్రమించు
నీవున్న చీకట్లను చీల్చడాన్ని
యివిగో
నాకలం వెలిగిస్తూన్న
విప్లవజ్యోతులు-

# పరిష్కారం

– వరిగొండ కాంతారావు

షికములోని పొలమువాడు
పత్తడి తెగ గొడతాడు
చెరువు కింది పొలమువారు
గగ్గోలుగ ఏడ్చెదరు.
బాటసారు లెందరకో
ప్రాణాలకు ముప్పురాగ
రహదారిని త్రవ్వుతారు.
త్రవ్వుటలో గల లాభము
పూడ్చుటలో లేదు గనుక
తమ పని పరి పూర్తికాగ
రహదారిని మరి మరిచెదరు.
బస్సులోన ఒక జులాయి
ఎక్కి దిగే మార్గములో
దున్నపోతువలె నిల్చును.
ఒకరిద్దరు దుండగీళ్ళు
విమానాన్ని మళ్ళింతురు
ప్రయాణీకులెందరనో
యిబ్బందుల పాల్జేయును
పిరికితనం, నిర్లిప్తత
అసహాయత అనైక్యత
మనను వదలనన్నినాళ్ళు
కొంత మంది దౌర్జన్యం జాతినంత పీడించును.

---

ఎల్.ఐ సి. రామాయంపేట, మెదక్-502101

# ప్రజాశక్తి

— గులాంనబీ

ప్రజాస్వామ్యంలో, "ప్రభుత్వం"
ప్రజల కొఱకేనని
ప్రజలదేనని
ప్రజలే నిర్మించేదని
అన్నమాటలే కావని
ఉన్న మాటలేనని
"ప్రజాశక్తి" ప్రపంచానికి
పదే పదే చాటుతూనే యుంది
ప్రజారంజకులైన పాలకులకు
పట్టంగడుతూనే యుంది
రెండు నాలుకల పాలకుల
కొండనాలుకల కోస్తూనే యుంది
అయినా:-
పాలకుల అధికార దర్ప దంష్ట్రలు
ప్రజాశక్తికి కలిగిస్తున్న
గాయాలు మానిపోతున్నా గంట్లు మాసిపోలేవు
ఓ ప్రమోదూతా!
ప్రజాశక్తిని పాలకుల
ప్రలోభాల ప్రమాదాల నుండి
పరి రక్షించి ప్రతిభావంతం జేసి
ప్రజలకు ప్రమోదాన్ని
కలిగిస్తావని కలగాంచనా?

ఇం. నం. 3-4-84/బి, రాయపుర, హన్మకొండ-506011

# గమ్యం

— వి. వీరాచారి

నాసికాద్రికి యిరువైపుల లోయల్లో
మిణుగురుల్లా రెండు నేత్ర దివ్వెలు
అనుభవాన్ని ప్రతిఫలించే ముడుతల చెక్కిళ్ళ
కష్టాల చిత్రాలను లిఖించే కన్నీళ్ళు—
తెలియని జీవిత గమ్యం నిరాశ సంకెళ్ళను వేస్తుంది.
ఎండమావుల చిలక్కొయ్యపై
పంచెవన్నెల రామ చిలుకల పలుకులు—
పొక్కల కోసం పొంచి వున్న నక్కలు=
బ్రతుకు బాటకు యిరువైపుల మైలు
రాళ్ళలా నిల్చున్న రాబందులు
వాన్ని వల్లకాటి వైపు నడిపిస్తాయి
అనుక్షణం వెంటాడే కన్నీళ్ళతో
బ్రతుకు పోరులో సమిధ అవుతున్న వాడు
ఈ మోసాన్ని కన్నీటి పొరల్లోంచి చూస్తూ
నిజమని భ్రమపడుతున్నాడు
కన్నీటి పొరల వెనుక వున్న బడబానలాన్ని
కర్మ వూబిలో కూడుకొని చల్లారుస్తున్నాడు
ఆకలి పాపం చేసేవాడి పేగులు
అగ్ని శిఖల్ని కక్కినప్పుడు మాత్రం
ఇన్నాళ్ళ చరిత్ర గమ్యాన్ని వక్రీకరించిన
ఆ మైలు రాళ్ళ పునాదుల్ని కదలించి
మరో ప్రపంచ గమ్యానికి మరో మైలురాయిని వాడే నాటుతాడు.

రిసెర్చ్‌స్కాలర్ తెలుగు విభాగం, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్

# విశ్వ మానవ కళ్యాణం

– బి. రాము

నా కరశరాలు ముందుకు దూసుకు పోతున్నాయి
కుల వృక్షాన్ని నరకాలని
నా కనుచూపులు తీక్షణమై పరుగిడుతున్నాయి
మతం మత్తును దించాలని
నా గళఘంటిక నిరాటంకంగా మోగుతున్నది.
అంతరాలను తరిమికొట్టాలని
నా మండే గుండే ఘోషిస్తున్నది
శిఖరారోహిత స్వార్థాన్ని-పాతాళానికి దించాలని
అందుకే నేను ముందుకు దూకి
వీర విహారం చేస్తూ
వీర కంకణం కట్టుకున్నాను
వీరగంధం పూసుకున్నాను
విశ్వ మానవ కళ్యాణానికి
నాంది గీతం పాడటానికి
విశ్వ వేదిక సిద్ధపరుస్తున్నాను.

రామలోక 5-43, సప్తగిరి కాలనీ, కరీంనగర్-505002

# మండే మానవ గోళం

– షప్పూరి శ్రీధరాచార్య

విప్లవం పూల తోటలో
పరిఢ విల్లే మొక్క కాదు
జనం గుండెలు మండి మండి
బ్రద్దలయ్యే జ్వాలముఖియది
అణిగిమణిగి ఎదురు పలకక
నడుచుకొనుట పిరికితనమా?
మబ్బుచాటున దాగి సూర్యుడు
మబ్బు చెదిరిన మరుక్షణం మండి పోడా!!
జాతి అహంకృతి పెరిగిపోయి
గ్రుడ్డి కళ్ళతో కాంచలేని
పెద్దలున్నంత కాలం
పీడనత్వం నిలిచిపోదా?
విశ్వ జాతి చరితలన్నియు
పీడకులతో నిండి వుండోయ్
అట్టి వారి పీచ మడచగ
జాతి జాతితో నిలిచిపోరదా?
దక్షిణాఫ్రిక తెల్లజాతి
తెగులు మీరి సంచరించిన
పట్టపగటి సూర్యోదయాన
'మండేలా' మరి వెలిగిపోడా!!

---

పోస్టు: తమసి, ఆదిలాబాదు

# నేస్తం !

'ఉషాకిరణ్

అనంత విశ్వంలో
జీవిత నందన వనములో
వికసిస్తున్న కుసుమాలకు
స్నేహ హస్తాలను
అందిస్తున్న యీ
ప్రత్యూష పవనాలలో
సువాసనలు గుభాళించె
గులాబి మరిమల్లెలు
అందిస్తే శాశ్వత స్నేహ
సువాసన సౌరభములను
ఆస్వాదించగలదు నేస్తం!

# అనాగరిక వేలం

- యల్. వేణుగోపాలరావు

ఆనాడు నిన్ను నడివీధిలో
వేలం వేసినపుడు
నీవు వ్యక్త పరచిన అశ్రు రహిత వేదన
నిన్ను వీక్షించిన సహస్రాక్షులలో
ఏ ఒక్కరు ఆదుకొనువారేలేరని
కినబరచిన ఆవేదన గమనార్హము.
అందరి కళ్ళకు కనువిందుచేసినా
అందరి నోళ్ళను ఊరించినా
కవి హృదయాన్ని రంజింపచేసినా
రసికుల ఎదలను కలవరపరచినా
ఏ హృదయం స్పందించలేదు
నిన్నాదుకొనుటకు ముందంజవేయలేదు
అందుకే కాబోలు...
పకృన వికటపు నవ్వు నవ్వి
I Im ready for the deal... అని
విధి బలీయంతో రాజీ పడ్డావు
నీ సహనం సహృదయం, అనుపమానం
శ్లాఘనీయం
దాస్యం విధి లిఖితమని
సంతృప్తి చెందావు కాబోలు
కాని అది విధి లిఖితం కాదు
ఆనాడు ఈనాడు
మనిషి నీ నుదుట వ్రాసిన లిఖితం
సభ్య సమాజం విధించిన అమానుష శాసనం

ఇ. నెం. 5, టి.ఎన్.జి.వోస్. కాలనీ, వొడ్డెపల్లి, వరంగల్-506 370

# నా దేశానికి నేను

— శీలం రాజేశ

నా తల్లి సిగపూవు సింగారం
నయనానంద కమనీయ కాశ్మీరం
కబళించు రాబందు కర్కోటకుల
వింము పసందు విహార స్థలి కాదు ఇది
నా దేశ సరిహద్దులు – లక్ష్మణ రేఖలవి
దిగంత కీర్తిమంతుడు
నా సరిహద్దు రక్షక జవానుడు
ఇక నీ మాయలు – మోసములంతము
అగ్ని పృధ్వీ ఆకాశములు
నిన్నణు మాత్ర మధిగమించ నీయవు
పాగావేసిన ఆకతాయి మూకల
అగడములో నాశ
అంతము! అంతము!
నేను నా దేశానికి స్వంతము! స్వంతము!

ఇ. నెం. 5-9-25, లష్కరుబజారు, హన్మకొండ.

# జన్మగండం

—అనిశెట్టి రజిత

ఎందుకీ ఆడ పుట్టుక పుట్టానంటూ
బ్రతుకంతా ఏడ్చే అవకాశమే
నీకిక ఉండబోదు లేవోయ్—
ఇన్నాళ్లూ నిన్ను నిన్నుగా
నిన్ను మనిషిగా గుర్తించమంటూ
పోరాటం చేస్తూ వచ్చావు
ఈ కబేళా సమాజంలోకి రాకముందే
గర్భంలోనే నిన్ను మింగేస్తుందో సుడిగుండం
ఈ ఆధునిక ప్రపంచం
కనీ విధించే జన్మగండం
చానాళ్ళకు ఆడ బ్రతుకు మీద
దయ కలిగింది కదూ కసాయి ప్రపంచానికి
నిన్ను పుట్టనిచ్చి పెరగనిచ్చి
సమస్యలు కొనితెచ్చుకోవటమే దండగనీ
లింగ నిర్ధారణ పరీక్షతో నీ ఉనికిని
సమాధి చేయాలని పుట్టగతే లేకుండా
నీకు ముక్తిని అనుగ్రహిస్తున్నారు
నీవు జీవిస్తూ హింసింపబడే శిక్షంటూ
అసల్లేకుండానే మొదలంటూ కొట్టేస్తున్నారు
ఇకపై విముక్తి కావాలంటూ వచ్చేదాకా
అరిచి గీపెట్టే కష్టమే నీకిక ఉండబోదు లేవోయ్.

ఇం. నం. 3-12-47, కుమారపల్లి, హన్మకొండ-506 001

# మరో యుద్ధం మనకొద్దు

— జి. ప్రభాకరస్వామి

ఆకాశాన్నంతా చుట్టబెట్టి నా మస్తిష్కశాలలో పరిచి చూస్తున్నాను–
చుక్కలు గుక్కపెట్టి ఏడ్వడం నేను వింటున్నాను
చంద్రుడు... తన్ని పడేసిన బంతిలా దొర్లుతున్నాడు
నా జాతి పాదాలను తప్పనిసరియై మోస్తున్నాడు
నక్షత్ర నాడీ మండలం కొట్టుకుంటోంది
మిణుకు మిణుకు మంటు
ఇటువైపు.... ఆకాశ ప్రయోగశాలలు
అణుబాంబుల స్థావరాలు
అంతరిక్ష వక్ష స్థలంపై నక్షత్ర యుద్ధనమోనాలు
నానా రకాల వ్యోమ నౌకలు హద్దులు చూపుతున్న జెండాలు
నక్షత్రాలన్నీ కలిసి ఒక్కసారిగా అరిస్తే బావుండు
క్విట్ స్పేస్ .. క్విట్ స్పేస్... అని
నా కళ్ళ నిండా చూడ గలుగుతున్నాను
అగ్రరాజ్యాల ఆరాటాలు లేసర్ కిరణాల పోరాటాలు
మొండాలు.... తెగిపడిన అంగాల పొర్లాటాలు
అడవుల్లో గ్రీష్మానికి రాలిపడిన ఆకుల్లా
నా జాతి శవాలు
ప్రగతి మాట అడ్డుతో విశ్వగతిని మార్చేవారు ఎవరైతేనేం
ప్రపంచ జనులారా! నినాదమివ్వండి
వినాశానికి దారి తీసే విపరీతబుద్ధి మానుకోవాలని–

ఇ. నెం. 5–8–39, లష్కర్ బజార్, హనుమకొండ-506 001

# ఏమో...

— తాతిరాజు

ఏమో ....
ముందటికొక సుందరమయ జీవితమే వుందేమో
గతుకులపడి చితికిన బతుకే మెరుగవుతుందేమో
గూటినివిడి వెళ్ళిపోయిన గువ్వే తిరిగొస్తుందేమో
చెదిరిన కల చిత్రంగా మళ్ళీ మొదలవుతుందేమో
ఏమో!

తాతిరాజు వెంకటేశ్వరరావు, ఇ. నెం. 1/705/ఎ-బి-16,
అడ్వకేట్స్ కాలని, బాలసముద్రం హన్మకొండ - 506 001

# విప్లవం

— యాతవాకిళ్ళ నరసింహమూర్తి

బాత్ రూములో బ్రైడ్ బర్నింగ్స్
చౌరాస్తాలో గ్యాంగ్ రేపింగ్స్
పెద్ద ఎత్తున ఆడ పిల్లల కిడ్నాపింగ్స్
విదేశాలకి ఓడల్లో ఆడబానిసల సేల్స్
స్త్రీని అంగడి బొమ్మచేసే
అబలల బ్రతుకుల్తో
చెలగాటమాడే
ఈ సమాజాన్ని చూచినపుడు
నాకు అనిపిస్తుంది
నా కసితీరా
రివాల్వర్ తో కాల్చి కాల్చి
చంపాలని....
నేనొక విప్లవ గెరిల్లాను
కావాలని.

# పునరపి...!

— డి.వి. శేషాచార్య

నా మెదడు చుట్టూ
ఆలోచనల తేనెటీగలు ముసురుతున్నాయి
ఎద రొదకు నా చెవులు
పనిచేయడం మానుకున్నాయి
కనుల నుండి రాలుతున్న బిందువులు
చెక్కిళ్ళ నుండి నోటిని చేరుతున్నాయి
రుచిని చెప్పాల్సిన నాలుక
చెప్పలేక పోతున్నది
ఉన్నట్టుండి నా మనస్సులో
ఏదో అగ్నిగుండం లేచింది
వేడిని ఓర్చుకోలేక
గుండె గడి తలుపులు తెరచుకొని
భావ విహంగం రెక్కలు విప్పుకొని
ఆకసంలో తన దారిని చూసుకుంది

ఇం. నెం. 6-3-112/1, బ్రాహ్మనవాడ, హనుమకొండ-506011

# మన జ్ఞాన పీఠకు అక్షరార్చన

— డా॥ సి.వి. జయవీర

జాను తెనుగు రసిక కవికి
'జ్ఞాన పీఠ' అవార్డు
తెలుగు జాతి వారలకిదె
కలిగె నవిగో రివార్డు.
గళం విప్పితే చాలు
కోటి శబ్ద స్వరాలు
కమనీయపు కంఠంలో
రమ్య భావ తరంగాలు.
ఆధునికుల జానపదుల
కవుల భావ మధురిమలు
తేట తెనుగు కవితలల్లి
తీయగ వినిపించెనహో.
ఆచార్యక వృత్తిలోన
అమృతాన్ని పంచినాడు
అధికారిగ అలరించి
అభివృద్ధిని చూపినాడు.
కవిగ వెలసె రవిగ వెలగె
కావ్య జగము వెల్లి విరిసె
సాహితీ మూర్తి సహృదయత
సరసుల నాహ్లాదము నింప—

ఆంధ్రోపన్యాసకుడు, ప్రభుత్వ జూనియర్ కళాశాల, హన్మకొండ.

# ఉషస్సు

— ఏవియస్

ప్రమోదమా!
నిన్నటి నేను రేపటి నీ కోసము
నిద్రలేమితో 'నేటితో' ప్రతిఘటిస్తున్నాను—
నేటి రాత్రంత
రేపటి రంగుల కలల గజిబిజిలతో,
నిన్నటి విషాదపు కల్లోలాల మరకలకు
'ప్లాస్టిక్ సర్జరీ' చేయించాను—
మనోగాయాలకు కర్పూర లేపనము చేయించి
నా గతమంతా చరిత్రగా చుట్టిపెట్టి
అర్ధరాత్రి స్వాతంత్ర్యము కొఱకు—
రాబోయే రేపటి నీ కోసము ముస్తాబై
రిహార్సల్స్ చేస్తున్నాను.
నా రక్త నాళాల్ని ఉద్రేకంతో చిట్లిస్తున్నాను
నిన్నటి రుమేనియా ఉక్కు పిడికిళ్ళను
నేటి ప్రజా వజ్రాయుధముతో కత్తిరించి
మదోన్మాదపు కళ్ళనూడబెరికి
పెళ్ళబికిన రక్తాశ్రువులాంజలితో
నీకు స్వాగతము పలుకుతున్నాము—
దశాబ్దాల తెల్ల జాతి ఉక్కు పాదాల నలిగిన
నల్ల జాతి మేటి సింహము మండేలా
జీవిత వసంతాల్ని కరిగించిన
జాత్యాంహంకారాన్ని సమాధి చేస్తావని
ఈ రాత్రంతా రేపటి నీ ఉషస్సుకై
నిద్రలేమితో "నేటితో" ప్రతిఘటిస్తున్నాను

అయితరాజు వెంకట్రాంనర్సింహారావు, బ్యాంక్ ఆఫ్ ఇండియా, వరంగల్.

# వసంత గీతం

— నమిలికొండ బాలకిషన్‌రావు

ఈ ఉషోదయం
రేపటి ఆశల నిలయం
నిన్న అరచిన కాకిపిల్ల
నేడు కోకిల రాగం నేర్చింది
నాట్యం నేర్చిన నెమిలి
నగారా మోగిందని
నేడే నాట్యమాడుతుంది
మొన్న మోడు బారిన వృక్షం
క్రొత్త చిగుళ్లతో చిగురులందించింది
రాత్రి మొగ్గలై నిటారుగా నిల్చిన
ముద్ద మందార చెంగు మల్లె విరజాజులు
నైట్ క్వీనులై
నేడు కమ్మని వాసనలు వెదజల్లుచున్నాయి
ఈ ప్రకృతి ఒక్కసారి
పులకించి వసంత గీతాన్ని
పా డు తూ....
నిన్నటి సంధ్య — సంధి కుదిర్చింది
ఈ ఉషోదయం రేపటి ఆశల నిలయమని.

ఇ. నెం. 6–7–42/ఎ, రాగన్నదర్వాజ, హన్మకొండ.

# చక్రగమనం

– కె.వి. సంతోష్‌బాబు

కాలచక్రగమనంలో
కలరవమో, కలకలమో తెలీదు కాని
ప్రజల 'కల' కలగా మిగిలి పోరాదు
చక్రానికి కందెన లాంటి వారు ప్రజలు
అమాత్యుల పల్లకీలు మోసే
అమాయకపు బోయీలు ప్రజలు
గాంధీజీ మళ్ళీ పుట్టాడనుకోండి
గల్లీ లీడరుగా నైనా పనికిరాడు పాపం
నెహ్రూజీ మళ్ళీ జన్మిస్తే
ఎన్నికల్లో ఓటమి తప్పదు
(రిగ్గింగు చేయడం చేతకాక)
పోయిన ఉగాది రోజు శుక్ల సుందరి అమాయకపు
నవ్వుల్ని చూసి అబల అనుకున్నాను కానీ....
గడుసుగా దేశ చరితనే మార్చివేసింది
ప్రమోదూత వస్తోందని తెలిసింది
ఎన్నెన్నో ఆశలు అంకురించాయి నా మదిలో
మాయలూ మర్మాలు కోరడం లేదు నేను
మంచి జీవితం ప్రసాదిస్తే చాలు
ప్రజలు కోరేది పంచ భక్షపరమాన్నాలు కాదు
ప్రతి పూటా ప్రతి నోటా వచ్చేది మెతుకులుమాత్రమే
సమైఖ్యతతో ప్రజలంతా జీవిస్తే చాలు
ప్రజల దూతగా నీకు ప్రణామాలు వేవేలు.

3–1–204 కెప్టెన్ విజయరఘునందన్‌నగర్, కరీంనగర్ – 505002

# వరం

—టి. జితేందర్ రా

గతం గతుకుల మయం
వర్తమానం అతుకుల మయం
అందుకే భవిష్యత్తు మీద ఆశ
అదైనా ఆనందమయం కావాలని
ఒంటిరంగులకు శిక్షలు
స్వేచ్ఛా ఊపిరులకు శిక్షలు
అంతటా కక్షలు – శిక్షల మయం
భూగోళం చుట్టూ భయావరణం
అయితే యిప్పుడిప్పుడే కొంతమార్పు–కొత్తమార్పు
తొక్కిపట్టే ఉక్కుపాదాలు
కరిగిపోతున్నాయి ఇగిరిపోతున్నాయి–ఎగిరిపోతున్నాయి
మండేలాల మంటలు
కటకటాల్ని కాల్చేస్తున్నాయి
నలిగిపోయిన నమీబియాలు
నడుం లేపుకుంటున్నాయి
ఇది ఓ వైపు ఉదయాలకు ఉదాహరణ
ఇంకో వైపు ఉదయాల కోసం
కూడికలు – తీసివేతలు
కడుపు తీపి – సీటుతీపి
గెంతడాలా–గోతులు తవ్వడాలు
లేని ప్రజాస్వామ్యం రావాలి
అలా భూగోళం ఆనందమయం కావాలి
అదే ప్రమోదూత యిచ్చేవరం కావాలి

ఇం.నెం. 2-10-82, వడ్డేపల్లి, వరంగల్-506370

PRAMODOOTA an anthology of Freeverse Poetry
Edited by T. Sri Ranga Swamy, Vidyaranyapuri, Warangal

---






## మా ప్రచురణలు

1. శ్రీరామ శతకము – శ్రీ టి. రామానుజస్వామి రూ. 10-00
2. కవితాగానం – శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి రూ. 3-00
3. ద టు జెంటిల్‌మెన్ ఆఫ్ వెరోనా – డా॥ జి. దామోదర్ [తెలుగు అనువాదం] రూ. 12-00
4. వేణు తరంగాలు – యల్. వేణుగోపాలరావు రూ. 5-00
5. ప్రభవ (కవితా సంకలనం) – శ్రీ టి. శ్రీరంగస్వామి [సంపాదకత్వం] ఒక సహృదయం (ప్రతులు అయిపోయినవి)
6. వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 15-00
7. కవితావనం – శ్రీమతి ఇందిరా చిరంజీవి రూ. 6-00
8. జన్మభూమిసిరులు – పల్లెసీను రూ. 6-00
9. జీవనరాగాలు – శ్రీ యల్. వేణుగోపాలరావు రూ. 10-00
10. శుక్ల (కవితా సంకలనం) – శ్రీ టి. శ్రీరంగస్వామి [సంపాదకత్వం] రూ. 5-00
11. ఎమ్మెస్సార్ కథలు – శ్రీ యం. సుబ్బారావు రూ. 9-00
12. ప్రమోదూత – (కవితా సంకలనం) శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 6-00 (సంపాదకత్వం)

---

Estd. 1977 (Regd. 2337)

A Publication of SRILEKHA SAHITHI
H. No. 5-11-~~114/4,~~ 481 Vidyaranyapuri, Warangal-506009

Price Rs. 6/ Ugadi 1990